# ఆశీస్సు

శ్రీ శివాయ గురవే నమః

శ్రీ సంజీవనౌషధనేత యీ మీసత్కృతికి ఆయురారోగ్యైశ్వర్యములననుగ్రహింప నా ఆశ.

శ్రీవారిసన్నిధి
తెనాలి
18-1-1959.

భాగవతుల అన్నపూర్ణయ్య.

---

మంతనములు సద్గతులకుఁ
బొంతనములు ఘనములైన పుణ్యముల కిదా
నీంతనపూర్వ మహౌఘ ని
కృంతనములు రామనామ కృతి చింతనముల్.

పోతనామాత్యుఁడు.

---

# ప్రశంస

ఆదికావ్యసార మాపదుద్ధారక
శతక మార్తజన రసాయనంబు
జడత లడఁచి భక్త సంజీవి యగును శ్రీ
రామ చరణజలజ రజమువోలె.

చీరాల,
19-1-59.

బందా ఆదినారాయణ.



ప్రణతార్థప్రదసీత డాపటను, సేవామూర్తి సౌమిత్రి ద
క్షిణసీమన్ భజియింప, నీలతనువున్ స్మేరాననంబున్ గృపే
క్షణ లొప్పన్, వరదాభయప్రదము - శస్త్రంబైన హస్తంబు మా
హనుమన్మస్తముఁజేర్చు నిన్ గొలుతు రామా! ఆపదుద్ధారకా!

ఓమ్
శ్రీరామచంద్రాయ నమః
శ్రీ సాయీ ప్రసన్న!

# విజ్ఞప్తి

భక్తజనులారా!

శ్రీరామచంద్రానుగ్రహమున, సోదరభక్తుల ప్రేమాదరణముల కతన సప్తర్షి రామాయణసహిత శ్రీ ఆపదుద్ధారక శతకమునకు ద్వితీయ ముద్రణభాగ్యము కలిగినది. ఈకృతి రచనాకారణాదులనుగూర్చి మొదటి కూర్పునందు విన్నవించియుంటిని, సోదరభక్తులకవి విశదములగునను తలంపున వాని నిందు బ్రస్తావింపక యొకటి రెండు ముఖ్యాంశములను బేర్కొందును.

ఈకృతి ప్రథమ ముద్రణమునకు నా పెత్తండ్రి కుమారుఁడు చి॥ శ్రీ చన్నాప్రగడ శ్రీరామకృష్ణశర్మ, (I.L.T.D. Co. Ltd. Guntur) ద్రవ్యసహాయము చేసినాఁడు. అందు నా పితృపాదుల జనకవంశమును గీర్తించి నా కృతజ్ఞతను దెలుపుకొంటిని. ఈ కృతికిఁ బ్రప్రథమమున నాంధ్రలోకమున వెలువడుభాగ్యముఁ గల్పించిన నా పినతమ్ముఁడగు చి॥ శ్రీరామకృష్ణశర్మకుఁ జిరాయురారోగ్య భోగభాగ్య వంశాభివృద్ధులను బ్రసాదించి శ్రీరామచంద్రుఁ డనుగ్రహింపుఁగాతమని ప్రార్థించువాఁడను.

* * * * * * *

"వేదవేద్యే పరేపుంసి జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షాద్రామాయణాత్మనా."

వేదవేద్యుఁడు- పరాత్పరుఁడగు పురుషోత్తముఁడు దాశరథియై యవతరింప, వేదములు వాల్మీకివలన రామాయణరూపము నొందినవి. వేదములు భారతీయ సనాతన సంస్కృతి – నాగరకతలకు మూలాధారములు. వానిని లెస్సగ గ్రహించి, యందు ప్రతిపాదితములైన ధర్మములను లోకమునందాచరణ పూర్వకముగ విశదపఱుపవలయును. ఆపని

వేదవేద్యుఁడు, పరాత్పరుఁడగు పురుషోత్తమునకుఁ దక్క యితరులకు సాధ్యముకాదు. ఆ కారణమున పరతత్త్వము శ్రీమన్నారాయణుఁడు కౌసల్యా దశరథులకు నందనుఁడై శ్రీరాముఁడన జనించి, వేద ప్రతిపాదిత ధర్మములను సమగ్రముగఁ దన జీవితమున ప్రదర్శించెను. శ్రీరామచంద్రుని జీవితచరిత్రమే ఆదికావ్యమై శ్రీమద్రామాయణ మను పేర వాల్మీకి ముఖోద్గతమయ్యెను.

"స్వసూక్తీనాంపాత్రం రఘుతిలక మేకం
కలయుతాం కవీనాం కో దోషః?"

"రామ।భూవరుచారిత్రము నెందరెన్నిగతులన్‌వర్ణించినన్ గ్రాలదే?"

"రామకథను వ్రాయనివాఁడు కవిగాఁడు" అను నుడులు పెక్కులుగలవు. ఆ కారణమున శ్రీరాముని కల్యాణ గుణ లీలా కథలను బలువురు కవులు గద్య, పద్య, నాటక, చంపూ, గేయ, కావ్య రూపముల పెక్కుభాషలలో రచించిరి. శ్రీరామ చరితామృతము నాస్వాదించి, సేవించి, స్మరించి, యనుసరించి యానందించనివారు లేరు, అతండిరి లీలల నేదొకరూపమున ధ్యానించుటకే యిందఱుకవు లెన్నియోవిధముల శ్రీరామ చరిత్రను బలికి ధన్యులైరి.

శ్రీమద్రామాయణ మొక గృహకావ్యము. ఈ విశ్వ మొక పెద్ద కుటుంబము. ఆదర్శ కుటుంబములోని వారెట్లు మెలఁగవలయునో శ్రీరాముని జీవితచరిత్ర మనకు బోధించుచున్నది. శ్రీరామచంద్రుని ఆదర్శమూర్తిగ - ఇష్టదైవముగ గుర్తించి, యాశ్రయించి యా ప్రభుపు నడుగుజాడల సాధ్యమగునంతదనుక మనుష్యులు నడువనేర్చిన లోక మంతయు సుఖ శాంతిభద్రతల కాలవాలమై పెంపొందుననుటకు సందేహములేదు. శ్రీరాముని చరిత్రలోని యంశములను బేర్కొని, యా ప్రభువును స్మరించు తలంపే యీ "శ్రీ ఆపదుద్ధారకశతక" రూపముఁ దాల్చినది.

1934 వ సంవత్సరమున శ్రీ శక్తిభద్రకవి రచిత "ఆశ్చర్య చూడామణి" అను సంస్కృతనాటకమును దెనిఁగించి, శ్రీరాముని కథను సప్తాంక నాటకరూపమున సోదరభక్తులకందించుకొను భాగ్య మాప్రభువు వీనికి ప్రసాదించినాఁడు.

సప్తర్షి రామాయణము:-

5 సంవత్సరములకుఁ బూర్వము శ్రీ తిరుమల తిరుపతి దేవస్థాన మువారి మాసపత్రికయందు "సప్తర్షిరామాయణము" మూలశ్లోకములు ప్రచురింపఁబడినవి. వానిని సీసపద్యములలోఁ దెనిగించి 1959 యందీ ఆపదుద్ధారక శతకమున మొదటికూర్పునందుఁ జేర్చి ప్రచురించితిని. సోదరభక్తులు మూల శ్లోకములనుగూడచేర్పుడని కోరినందున ఈకూర్పు నందు మూల శ్లోక సహిత సీసపద్యములను జేర్చితిని.

శతకము- ద్వితీయముద్రణము:-

1959 లోఁ బ్రచురింపబడిన యీ శతకమును గోరిన సోదర భక్తుల కందించుటచే నచిరకాలముననే వేయి ప్రతులు వ్యయమైనవి. శ్రీరామ సాయీ ప్రేరేపణమున నింతకుఁ బూర్వ మపరిచితులయ్యు శ్రీసాయీలీలా ప్రచురణముల వలన సన్నిహితులైన సోదర భక్తులు చి॥ శ్రీ జి వేంకటకృష్ణయ్య, B. A., (Extension Officer. Co-op. Udayagiri Block. Nellore Dt.) గారు, పూజ్యులు నెఱదాతలగు తన జననీ జనకుల జ్ఞాపకార్థ మీ శ్రీ ఆపదుద్ధారక శతకమును తిరిగి ముద్రింపించ సంకల్పించి వారి యభిమతమును దెలిపిరి. శ్రీరామచంద్రప్రభు వీ రూపమున వారిసేవ నపేక్షించి ప్రేరేచెనని సంతోషించితిని. శ్రీరామ చరిత్రాత్మకమగు నీకృతిని మఱి వేవురకందించి తద్రూప సుకృతి

విశేషమును కీర్తిశేషులు, పూజ్యులగు తన మాతా పితరులకుఁ బ్రాపింపఁజేయు సత్సంకల్పముఁ గలిగిన చి॥ శ్రీ వేంకటకృష్ణయ్యగారు ధన్యులు. శ్రీరామ కథామృతము నేదొక రూపమున లోకమునఁ దార్వఁబెట్టుటకంటె నధికమగు యజ్ఞము లేదనువిషయ మెల్లరకు విశదము. ఇట్టి యుదారునిఁ గన్న యా ధన్యచరిత్రులగు తలిదండ్రులను సోదరభక్తుల కెఱిఁగించు తలంపున వారి ఛాయాపటము నిందు ప్రచురించి నాకృతజ్ఞతను దెలుపు కొనుచు చి॥ శ్రీ వేంకటకృష్ణయ్య గారిని, వారి కుటుంబములోని వారి నందఱను శ్రీరామచంద్ర ప్రభువు సర్వదా సర్వథారక్షించుచు, కీర్తిశేషు లగు వారి జననీజనకులగు శ్రీమతి సుబ్బలక్ష్మమ్మ, శ్రీ నరసింహులుశ్రేష్ఠి గారలకు ఉత్తమలోకప్రాప్తి సుఖ శాంతులను ప్రసాదించుగాత మని ప్రార్థించువాఁడను.

ఈకృతి పాఠకశ్రోతలకు శ్రీరామచంద్రమూర్తి సకల శుభముల ననుగ్రహించునుగాత!

శ్రీరామచంద్రః శ్రిత పారిజాతః, సమస్తకల్యాణ గుణాభిరామః
సీతా ముఖాంభోరుహ చంచరీకో। నిరంతరం మంగళమాతనోతు!!

శ్రీ సాయీ కటీరము
చిన్నగంజాము.
31-10-1963.

భక్తజన విధేయుఁడు,
బాపట్ల హనుమంతరావు,

శ్రీ సాయీ సమర్థ!

# శ్రీరామాయణకీ ఆరతి

ఆరతి శ్రీరామాయణ జీకీ
కీరతి కలిత లలిత సియపీకీ॥

గావత బ్రహ్మాదిక ముని నారద
వాలమీక విజ్ఞాన విశారద
శుక సనకాది శేష అరు శారద
బరని పవనసుత కీరతి నీకీ॥ ఆరతి॥

గావత వేద పురాణ అష్టదశ
ఛవోశాస్త్ర సబ గ్రంథన్హకో రస
మునిజన ధన సంతన్హకో సరవస
సార అంశ సమ్మతి సబ హీకీ॥ ఆరతి॥

గావత సంతత శంభు భవానీ
అరు ఘట సంభవ ముని విజ్ఞానీ
వ్యాస ఆదికవివర్య బఖానీ
కాగభుశుండి గరుడకే హీకీ॥ ఆరతి॥

కలి మల హరణి విషయ రస ఫీకీ
శుభగ సింగార భక్తి జువతీకీ
దళన రోగ భవమూరి అమీకీ
తాత మాత సబ విధి తులసీకీ॥ ఆరతి॥

శ్రీ శంకర ఉవాచ:-

రామ రామేతి రామేతి - రమే రామే మనోరమే
సహస్రనామ తత్తుల్యం - రామ నామ వరాననే!

# కృతజ్ఞత - ఆశీస్సు.

కవటగోత్రజులు వెంగంపల్లె వైశ్యులు
గుఱ్ఱము వారేని కొలముపెద్ద,
లతిపుణ్యశీల సుబ్బమ పతి చలమయ్య
శ్రేష్ఠి యే బుద్ధివరిష్ఠు తాత,
మాన్యులు సుబ్బలక్ష్మమ నరసింహులు
దయివాఱ నెవని మాతా పితరులు,
వీరమాంబా పతి వేంకటశేషయ్య
యే దయామయు నగ్రసోదరుండు

ఆ మహితు సత్యవతిదేవి ప్రాణ దయితు
నీదు భక్తు వేంకటకృష్ణు నిఖిల భోగ
భాగ్య వంశాభివృద్ధులఁ బఱపి చిరము
నేమఁగాఁగదె! ప్రేమ, శ్రీరామచంద్ర!

అతిహృద్యంబు భవత్కథామృత యుతంబౌ ఆపదుద్ధారకో
త్కృతికిన్ శోభకృతిన్ పునఃప్రకటన శ్రీఁ గూర్చె సేవాపరా
దృతి, మా వేంకటకృష్ణయార్యుఁడు, కృతార్థీభూతునిన్‌జేయుమా!
శ్రితమందారమ! రామ! శ్రీ జనకజా హృత్కంజరోలంబమా!

---

ఈ కృతి ద్వితీయముద్రణ ద్రవ్యదాత
శ్రీ జి. వేంకటకృష్ణయ్య, B. A., గారి



తండ్రి శ్రీ గుబ్బం నరసింహులుశ్రేష్ఠిగారు, తల్లి శ్రీమతి సుబ్బలక్ష్మమ్మగారు.
(వెంగంపల్లె, ఆత్మకూరు తాలూకా, నెల్లూరు జిల్లా)

ఓమ్

శ్రీ సాయీనాథాయ నమః

శ్రీరామచంద్రాయ నమః

# ఆపదుద్ధారక శతకము

శ్రీరామామణి జానకీరమణియై, శేషుండు సౌమిత్రియై
స్వారోద్దీపిత చక్రమే భరతుఁడై, శంఖంబు శత్రుఘ్నుఁడై
స్వారాడ్భృత్యులు వానరాకృతుల రాన్, వైకుంఠ! దైత్యేశ సం
హారార్థం బవతార మూనితివి; రామా! ఆపదుద్ధారకా!

శ్రితలోకావన కల్పభూమిరుహమా! సీతాముఖాంభోజ సం
గత షట్పాదమ! మంగళాయతనమా! కాత్యాయనీ శంకరా
ర్చిత కల్యాణగుణైక విగ్రహమ! నిన్ సేవింతుఁ, బూజింతు, స
మ్మతిఁ జేమోడ్పులనిత్తుఁ, గావఁగదె! రామా! ఆపదుద్ధారకా!

కమనీయాకృతు లూనుచున్ గవచముల్ ఖడ్గంబులన్ దాల్చి, చా
పము లాకర్ణముగాఁగ నెక్కిడి, కడున్ భద్రంబుగా రెండు పా
ర్శ్వములన్ ముందుగ నీవునీయనుజుఁడున్ వర్తింత్రు, నీభక్తు సే
మముఁ జేకూర్తురు; మీకు వే నతులు; రామా! ఆపదుద్ధారకా!

తొలిజన్మంబున నెట్టి వేలుపుల సంతుష్టాత్ములన్ జేసి, పూ
జల నేమేమొనరించి మించినదొ! కౌసల్యామహాదేవి; య
ర్మిలి నిన్నున్గని, యెత్తి, ముద్దులిడి, కూర్మిన్సాకుచున్, బైడియు
య్యేల లందుంచుచు జోలలన్ బఊప; రామా! ఆపదుద్ధారకా!

కాంచెఁ సద్గతి తండ్రియై దశరథక్ష్మాజాని; పుత్రేష్టిచేఁ
బంచాస్త్రోపముల మిమ్ము నల్వురను సంపాదించి మోదించుచున్
బంచప్రాణములుంచె నీ పయిని, సర్వంబిందు నం దీవ యా
నంచుఁ గొల్చె, నదెట్టిభాగ్యమొకో; రామా! ఆపదుద్ధారకా!

జన్మస్థాన మయోధ్య, మాసములలోఁ జైత్రంబుఁ, దారాళి నీ
జన్మఁ బావనమౌ పునర్వసువు నక్షత్రంబు, నెవ్వేళఁ; ద్వి
జ్జన్మఁ బేర్గనఁ బాలు శుద్ధనవమీ సౌమ్యాహ్నముల్ వీని శ్రీ
మన్మాన్యంబులటంచు మ్రొక్కెదను; రామా! ఆపదుద్ధారకా!

అమరఁ బంగరుపళ్ళెరంబునను ముత్యంబుల్ దగఁ నింపి, నా
మముఁ బేర్కొ నినుఁ గాంచి, మై మఱచి "రామా! రామ!"
యంచుఁ వసి
ష్ఠ మునీంద్రుండనుడున్, సభాసదులు సేసల్ చల్ల, "శ్రీరామ" నా
మము నీతండ్రి లిఖించి పొంగెనట; రామా! ఆపదుద్ధారకా!

మును వైకుంఠమునందు సేవలకు సమ్మోదంబునుం జెంది, యీ
జననంబందు ఋణంబులీఁగ భరతుఁ సౌమిత్రులఁ గూడి, నీ
జనముల్ మెచ్చఁగ నాటపాటలను బెల్చఁ గాలముఁ బుచ్చు నీ
యనురాగంబునకుఁ జోహరులివె; రామా! ఆపదుద్ధారకా!

వేదార్థ ప్రతిపాద తత్త్వమవు నీవే కాప! యీలోక మ
ర్యాదఁ నెల్పితి వా వసిష్ఠముని భాగ్యంబల్పమే! నీకు వి
ద్యా దానంబొనరించి, యక్షయపదం బార్జించి, నీ ప్రేమ సం
పాదింపంగనె; దేశికప్రవణ! రామా! ఆపదుద్ధారకా!

“ఏమేన్ గోరిననిత్తు, జన్నమును నేనేవచ్చి రక్షింతు, శ్రీ
రామున్ బంపఁగనోపఁ, బంపుదునయేన్ బ్రాణంబులా వీడు; వి
శ్వామిత్రా! సయిపంగదే!” యనుచు వాత్సల్యార్తి దైన్యత్రపా
వ్యామోహంబులఁ దండ్రిపొందెఁగద! రామా! ఆపదుద్ధారకా!

క్రతుసంరక్షణ కాంక్షియై దశరథక్ష్మాపాలు నొప్పించి, నీ
వతిభక్తిన్ దనవెంట రా నలరి, దివ్యాస్త్రాళిబోధించి, నిన్
గృతకృత్యున్ బొనరించు గాధిసుతు సంతృప్తాత్ము నిన్జేయు నీ
యతిమానుష్యపటుత్వమున్ దలఁతు రామా! ఆపదుద్ధారకా!

ప్రాణేశుండుశపింప రాయియయి మార్గంబందు నీ రాకకై
ధ్యానంబున్ బొనరించు గౌతము నెలంతన్బ్రోవవే? మౌని శా
పానూనార్తి నివారణక్షమ మహల్యా పాపపంకాపహం
బౌ నీ పాద సరాగమున్ దలఁతు, రామా! ఆపదుద్ధారకా!

సవనంబున్ బరిరక్షసేసితని విశ్వామిత్రుఁడున్ మేలు గూ
ర్ప విదేహేశు పురంబునన్ శివ ధనుర్భం గోరు కార్యంబు నుం
కువఁగాఁ గట్టడఁబెట్టి జానకిని నీకున్గూర్చె, నమ్మౌని భా
గ్యవిశేషంబు నుతింప నా తరమె? రామా! ఆపదుద్ధారకా!

తమ్ముల్ నీవును బెండ్లి రా కొమరులై దాయంగ నీ తండ్రి మో
దమ్మున్, తల్లులమోదమున్, జనకుమోదమ్మున్, వసిష్ఠర్షి మో
దమ్మున్, గౌశికుమోదమున్, బ్రజలమోదమ్మున్ వచింపంగ, వా
క్యమ్ముల్గల్గునె బమ్మకేని? రఘురామా! ఆపదుద్ధారకా!

అరవిందాసన వాసవాదుల కలభ్యంబైన నీ పాద నీ
రరుహంబున్, సతి నీరిడన్ గడిగి భద్రంబంచుఁ ద న్నీరమున్
బరమప్రీతిని మౌళిఁదాల్చి తనయన్ వైదేహి నర్పించి సం
బర మొందెన్ జనకుండు, ధన్యకృతి; రామా! అపదుద్ధారకా!

శ్రీస్తుత్యంబగు నీ ముఖాంబుజము వీక్షింపంగ లో నెంచి, తా
మ స్తంబెత్తఁగఁబోయి, వంచి, తగదీమార్గంబటంచున్, గళ
న్యస్తాలంబితహార నాయకమణిన్ ద్వద్రూపమున్ జూచి, మో
హా స్తీర్ణంబుఁ గనెన్ మహీతనయ; రామా! ఆపదుద్ధారకా!

లలనారత్నము సీత దోయిలినిఁదాల్పన్ గెంపులన్ గేలి, నీ
తలపెనిల్పఁగఁ గుందసూనముల యందంబున్ విడంబించి శ్యా
మలగాత్రంబును సోకి నీలమణులై మాంగల్యముల్ గూర్చు, నీ
యలఘూద్వాహపు సేసలన్ దలఁతు, రామా! ఆపదుద్ధారకా!

"తరుణీ మౌక్తిక, మెండకన్నెఱుఁగ దీ తన్వంగి వైదేహి, యే
కరణిన్ గాచెదొ! రామచంద్ర." యనుచున్ గన్నీరుమున్నీరుఁగాన్,
స్వరమున్ గద్గదమొందఁ, గంపముగగుర్పాటున్ గనన్ మేను, మో
హరతిన్ బల్కిన మామ ధన్యకృతి, రామా! ఆపదుద్ధారకా!

"పదునార్వన్నెకడాని చాయగల దీ వైదేహి, నీవో! నవాం
బుదనీలద్యుతి కోమలాంగుఁడవు-చాల్-పో-పొమ్ము, మాచెల్లిఁ దా
కెదవేన్ నీ నలుపంటు" నంచు నెకసక్కెంబుల్ చెలుల్ వల్క నె
మ్మది మోదింపవె? జానకీరమణ! రాఘా! ఆపదుద్ధారకా!

"హరకోదండ విఖండనుండవట! రమ్మా! నాదువిల్ వంచు, నీ
గరువంబేఁ గను" దంచు భార్గవుఁడు వీకన్బల్కఁ, విల్లీయఁ, ద
ద్వర చాపోరు వికర్షణంబుననె సత్త్వంబెల్ల నీ లోనికిన్
బఱుపన్జేసి పరాభవించితివి; రామా! ఆపదుద్ధారకా!

ధరణీపాలన నీదుతండ్రి నెఱపన్, దల్లుల్ ప్రమోదంబిడన్
చిరమున్, దమ్ములు నీ విధేయులగుచున్ సేవింప, సీతాసతీ
సరసాలాప విలాస భోగరచనా సౌఖ్యాబ్ధి వీచీ పరం
పరలం దూఁగినకాల మేమఱుతె? రామా! ఆపదుద్ధారకా!

"చనెఁ బో- యర్వదివేల వత్సరము, లీ క్ష్మాచక్రభారంబు నో
పను. శ్రీరామునకున్ సమస్త ధరణీ పట్టాభిషేకంబుఁ బెం
పునఁ గావించి, మదీయ జీవిత ఫలంబున్గాంతు," నంచెంచె నీ
యనుఁగుం దండ్రి; విధిన్గనండుగద! రామా! ఆపదుద్ధారకా!

జనుల్ మెచ్చిరి, లక్ష్మణుం డలరె, హర్షంబూనె భూజాత, భృ
త్య నికాయంబులు సంతసించెను, జనం బాబాలగోపాల మే
పున నుప్పొంగె, వసిష్ఠమౌని ప్రమదంబున్ గాంచె, దైవేచ్ఛ నే
మనవచ్చున్? నినుబంపెఁ గానలకు; రామా! ఆపదుద్ధారకా!

నిందింపన్ బనియేమి మంథరను? దండ్రిన్ దిట్టఁగానేల? నీ
యందున్ గైకకుఁ బ్రేమలేదనుట మేలా? యా వసిష్ఠర్షియున్
మందుండంచు వచింపఁగాఁగలమె? నీ మాయావిధానంబు నే
మందున్? సర్వముఁ గ్రిందుమీఁదగుట; రామా! ఆపదుద్ధారకా!

పలురీతుల్‌గల రాజ లాంఛనములన్ వర్జించి నీర్కావి వ
ల్కలముల్ సీతయు నీవు లక్ష్మణుఁడుదాల్పన్‌గాంచి, కన్నీరుగా
ర్వలుగా నేడ్వనివారలున్, జెనఁటి దైవంబెంత క్రూరాత్ముఁ డం
చలుకన్ బూననివారలున్ గలరె? రామా! ఆపదుద్ధారకా!

"ఆరామస్థలులన్ జరించుటకు నాయాసంబునుం గాంతు, ఘో
రారణ్యంబుల నెట్టురాఁగల? వయోధ్యన్నిల్వు" మంచీవు పెం
పారంబల్కిన; సీత- "నీవిమల పాదాబ్జార్చనల్‌సేయు నా
కారణ్యంబె- యయోధ్యవాస" మనె? రామా! ఆపదుద్ధారకా!

"రాముండే జనకుండటంచుఁ బరిచర్యల్‌సేయుమీ; జానకీ
భామారత్నము నన్నె కాఁదలచి సంభావింపుమీ, కానలే
సౌమిత్రీ! కనుమీ యయోధ్య-యని, నీ జన్మంబు సార్థంబు, పా
మ్మా- మేలౌ" ననుచున్ సుమిత్రయనె; రామా! ఆపదుద్ధారకా!

వనవాసవ్రత దీక్షలూని మువురున్ బైనంబునై నంత ని
న్గని మూర్ఛిల్లెను దండ్రి; విహ్వలపడెన్ గౌసల్య, కైకేయి సి
గ్గును భీతిన్‌గనెఁ; బౌరులెల్లరును గగ్గోలైరి, "హా! దైవమా!"
యని నిట్టూర్పు విడెన్ వసిష్ఠముని; రామా! ఆపదుద్ధారకా!

ధనముల్ గేహములున్ నిరర్థకము, సీతారాఘవుల్ లేని ప
త్తనమే భీకర కాననం, బిది, పరిత్యాజ్యంబ, కానెంచి నీ
వెనువెంటన్ జనదే? యయోధ్యాజన; మీవే సర్వమౌనంచు ని
న్ననువర్తించెడివారె సత్కృతులు; రామా! ఆపదుద్ధారకా!

మదిఁ జింతించు సుమంత్రు సమ్మతిని నా మంత్రించుటల్,
వెంటఁ బె
ట్టిదపుం గష్టములోర్చి వచ్చు జనకోటిన్ సాదరానూన భా
ష దలిర్పన్ బురికిన్ మరల్చుకృతియున్ సామాన్యమే? వారు ని
న్నదయుండంచుఁ దలంచిరేమొకద! రామా! ఆపదుద్ధారకా!

"తలఁపన్ జాలకుఁ గొయ్యముక్కలకు భేదంబున్నె? నీపాద స
జ్జలజాతంబుల మానుషీకరణ భస్మంబుంట విందున్; బదం
బులనిమ్మీ!" యని, భక్తిమైఁగడిగి, సమ్మోదంబునున్గాంచి, ని
ర్మలుఁడయ్యెన్ గుహుఁ-డెట్టినేర్పరియొ? రామా! ఆపదుద్ధారకా!

నీవేరాజ్యము, నీవ సర్వధనముల్, నీవే సమస్తంబుఁగా,
భావంబందుఁ దలంచు నీ జనకుఁడే పాపంబు గావించెనో!
"రావే! రాఘవ! రామచంద్ర!"-యనుచున్ బ్రాణంబులన్బాసె; నే
మా వాత్సల్య! మదెచ్చటేన్ గలదె?- రామా! ఆపదుద్ధారకా

"ప్రజలల్లాడఁగఁ దల్లులేడ్వఁగఁ, నిజప్రాణంబులన్ దండ్రి దాఁ
ద్యజియింపన్, గడియించుకొంటివి యయోధ్యారాజ్య,
మో యంబ! య
గ్రజు నేఁ జేరెద- నెత్తిఁగట్టుకొని, సౌఖ్యంబొంది పాలించుకొ
మ్మజకల్పాంత" మటంచుఁదమ్ముఁడనె; రామా! ఆపదుద్ధారకా!

"దురితాత్ముండవు- మాతృహంత; విఁక నీతోమాటలాడంగ నే
వెఱతున్బొమ్మని,యంబ! యన్న,యను,నాభీతిన్ గనంజాల నేన్
గరవాలంబునఁ గండతుండెములుగా ఖండింతు ని"న్నంచు మున్
భరతుండాడె, నదెట్టి పేరిమియొ? రామా! ఆపదుద్ధారకా!

"నీ యాశామతికంతమున్గలిగెనే? నీచాత్మ! నన్గాంచి, 'కై
కేయీపుత్రు డితండె. యాతఁ' డని, సాకేతప్రజల్ తిట్ట, నీ
కై యేద్వ్ నను గంటివేమొకద? యంబా!" యంచుఁ
దమ్ముండనెన్,
మాయాబద్ధులు గానివారెవరు? రామా! ఆపదుద్ధారకా!

జననిన్ దూఱెను, మంథరన్ దెగడె, దుశ్చారిత్రుఁడన్, నన్ క్షమా
వణసేయంగదెయంచు నీదు జననిన్ బ్రార్థించె; 'నాయన్న నే
మనిచూడంగల' నంచు నేడ్చెఁ, బ్రజ నత్యాసక్తి నోదార్చె, నే
మనవచ్చున్ భరత ప్రభావమును? రామా! ఆపదుద్ధారకా!

నిను దాయంజను సైన్యయుక్తు భరతున్ వీక్షించి శంకించె గం
గను దాటింప గుహుండు, జాడఁదెలుపంగా నా భరద్వాజుఁడున్
వనమందేన్ బ్రతుకంగనీయఁడనుచున్ భావించె సౌమిత్రి; యా
త్మ నెఱుంగన్ దడవోర్చువా రెవరు? రామా! ఆపదుద్ధారకా!

అనురక్తిన్ నినుఁ జిత్రకూటమున డాయంజేరి తమ్ముండు వ
ల్కినపల్కుల్ శపథంబులున్ వినమితుల్ పేర్కొన్న నెవ్వారికే
ననురాగంబు జనింపకున్నె? పితృవాక్యార్థంబె కాకున్న నీ
వనుమానింపక కౌగిలింపఁ జనవె? రామా! ఆపదుద్ధారకా!

"భరతా! కైకను దూఱుదేని నిఁక సైపన్ జాలఁ; కౌసల్యతో
సరిగానెంతును; దైవయోగము మరల్చన్ శక్యమే యేరికిన్!
గురునాజ్ఞన్ బొనరింప శ్రేయమగు నీకున్ నాకు; రా కర్త మే
మఱుపాటొందక సల్పు" మంచనవె? రామా! ఆపదుద్ధారకా!

"అనుమానింపక నాదుమాటవిను మన్నా! తల్లులన్ మంత్రి భృ
త్యనికాయంబులఁ బౌరులెల్లర సముద్యద్భీతి భావింపు; కై
కొను నీ కోరువిధానఁ బాదుకలు, నీకున్ మేలు పొ"మ్మంచుఁ బ్రే
మను నోదార్చవె నమ్రుఁడౌ భరతు; రామా! ఆపదుద్ధారకా!

"పితృసంత్యక్రియలన్ బొనర్చితివి నీ వృత్తంబు సామాన్యమే?
సుతులన్ నల్వురఁగాంచియున్ దుదిదశన్ జూడంగ నొక్కండు లే
క తనూత్యాగముసేసె; తండ్రిఋణ మీఁగన్ లేని నా జన్మమే
యతినింద్యం" బని తమ్ముతో ననవె? రామా! ఆపదుద్ధారకా!

నారల్ గట్టి, సుఖంబులన్ విడచి, నీ నామంబె ధ్యానించుచున్
తీరౌ గద్దియఁ బాదుకల్ నిలిపి, భక్తిన్ గొల్చుచున్ బాలనా
భారంబూని, వియోగకాలమును సైపన్ లేక లెక్కించెఁ, దా
నౌరా! తమ్మునిదీక్ష యెట్టిదియొ?- రామా! ఆపదుద్ధారకా!

అలరుంబాన్పులఁ దూగుటుయ్యేలల దివ్యాంతఃపురంబందు నె
చ్చెలులంగూడిసుఖించు జానకి, తపస్విన్యాకృతిన్ - బర్ణశా
లల ఱాలంబడి, కందమూలఫలముల్ భక్షించుచున్ బేర్మి ని
ర్మలచిత్తంబున నిన్ను గొల్చెఁగద!- రామా! ఆపదుద్ధారకా!

పత్రముదంబీయఁగఁ దల్పమై, తలగడై, భద్రాసనం బాత ప
త్రము వింజామరలై, సమస్తపరిచర్యల్ సల్పు శేషుం డర
ణ్యములం దాకలి దప్పులన్ వదలి, యత్యాసక్తి నిన్ గొల్చు భా
గ్యముఁ గాంచెన్గద! లక్ష్మణాకృతిని; రామా! ఆపదుద్ధారకా!

వసుధాపుత్రిక! లోకమాతయనుచున్ బాటింపకే, మహ్యాచే
తసుఁడై కామ వికారదుష్కృతికిఁ దత్సంకల్పమాత్రాన వా
యసరూపంబుఁగనెన్ జయంతుఁడు; సమస్తైశ్వర్యముల్ వాపి దు
ర్వ్యసనంబీయదె? నీచపుం దలపు; రామా! ఆపదుద్ధారకా!

పరివర్జించెను తండ్రి, త్రోసిరి ఋషుల్, "పాపాత్మ! కాకాసురా!
దరియన్ రాకు" మటంచు వేల్పులుఁ బరిత్యాగంబుఁ గావించి, రీ
శ్వర కోపానల తప్తుఁడౌ ఖలునిఁ బాపంబంచుఁ జేపట్టి తెం
పరు లేరేన్ గలరే జగంబులను?- రామా! ఆపదుద్ధారకా!

శరణంచున్ దలక్రిందుఁగాఁ బడిన దుశ్చారిత్రునేన్ గాతు, నీ
కరుణాంభోధికి మేర యెందుఁగలదే? కాకాసురుం డట్లు ది
క్కఱి, నీవేగతియంచుఁ గాళ్ళఁబడ, వాఁ డార్ద్రాపరాధుండటం
చరయన్ బోవక రక్షణంబిడవె? రామా! ఆపదుద్ధారకా!

"శిక్షార్హుం డతిపాపకర్ముఁడయినన్ జేమోడ్చి, తా నెవ్వఁడేన్
రక్షింపంగదె! యంచు దీనమతియై ప్రార్థించెనేన్, బ్రోవఁగా
దీక్షన్ బూనితి" నంచుఁ దెల్పితివి కాదే?- యట్లుఁ జేపట్టఁ బ్ర
త్యక్షంబైన ప్రమాణ మీ వగుదు; రామా! ఆపదుద్ధారకా!

ఏ పుణ్యంబులఁ దొల్లిఁ జేసెనొకొ బ్రహ్మేంద్రాది దేవాళికిన్
బ్రాపౌ నీపద పంకజంబుల వహింపన్ జిత్రకూటాద్రి; హృ
త్తాపధ్వంసిని గౌతమీనది మహత్త్వంబేమొ? స్నానాది స
ద్వ్యాపారంబుల నీకు సాయపడె; రామా! ఆపదుద్ధారకా!

ఆసల్ సర్వము వాసి, దుఃఖయుత గార్హస్థ్యంబులన్ రోసి, మో
క్షాసక్తిన్ వన సీమలన్ నియమదీక్షల్ పూను మౌనీంద్రులేన్
నీ సౌందర్య విలాస సంపదల కెంతేన్ ముగ్ధులై కాముక
వ్యాసంగంబునఁ గౌఁగిలింపరొకొ?- రామా! ఆపదుద్ధారకా!

అరుదై, కన్నులపండువై, కుదురునై, యందంపుఁ బెందీవియై
మురిపెంబుం దొలుకాడు జవ్వనపు సొంపుల్ నింపు నీ రూప మ
బ్బురముందోపఁగఁజూచి, శూర్పణఖ, వ్యామోహంబు రేకెత్త నీ
మరుగున్ జేరదె? ప్రేమఁ జూఱఁగొన; రామా! ఆపదుద్ధారకా!

వగనేన్, దార్కొను భీతినేన్, దగిన సంబంధాననేన్, భక్తినేన్
బగనేన్, గాముక బుద్ధినే, నలుకనేన్, బ్రజ్ఞాన సంలబ్ధినేన్
దగ నిన్జేరెడి జీవసంతతినిఁ ద త్తద్రీతిఁ బాలించి, భ
వ్యగతిన్ గూర్పవె? సత్కృపామతిని; రామా! ఆపదుద్ధారకా!

నిను నర్థించియు నిష్ఫలాత్ములగు టెందేన్ వింటిమే? యొంట, నా
జననంబందు లభింపకుండినఁ బునర్జన్మంబునందైనఁ గో
ర్కెను సాధింపరె?- పొందెఁ గుబ్జగ, నినున్ గృష్ణావతారానఁ గా
మ నిరాశామతిఁగన్న శూర్పణఖ; రామా! ఆపదుద్ధారకా!

నీ విల్కాఁనితనంబు నీదు బలమున్ నీ సవ్యసాచిత్వమున్
నీ విద్యల్ ఖరదూషణాది దితిజానీకంబు వీక్షింపదే?
లావేదన్, బదునాల్గువేల యసురుల్ ప్రాణంబులన్ బాసి, మో
క్షా వాప్తిన్ గనఁబోరె! నీ కృపను; రామా! ఆపదుద్ధారకా!

"మనుజానీకము లప్పుడంబులకిట్లయం భక్షించు మావారి యే పణఁగింపంగల రాకుమారుఁడెవఁడబ్బా!" యంచు నాశ్చర్యమున్ గనియెన్ రావణుఁడంత వాఁ; డసురమూఁకన్ జీల్చిచెండాడు శౌ ర్య నిధానంబని సుంతయేన్ గనఁడ? రామా! ఆపదుద్ధారకా!

"ఓరీ! రావణ! నాదు మాటవిను, మెట్లో, ప్రాణముల్ దక్కి, యీ తీరంబందునఁ గూలఁద్రోయఁబడితిన్ దివ్యాస్త్ర వాతాహతిన్ శ్రీరామున్ జెనకంగఁబోకు బ్రతుకం జింతింతువే" నంచు నా మారీచుండనె నీ బలంబెఱిఁగి; రామా! ఆపదుద్ధారకా!

"నీచేఁ జచ్చిన, రావణా! చెడెదఁ, గానీ రాముచేఁ జత్తునేన్ వాచా గోచరమైన భవ్యపదమున్ బ్రాపించుఁ బో" మ్మంచు, మా రీచుండెంచి మృగాకృతిన్ దఱిసినన్ పృధ్వీజ యద్దానికై యాచించెన్ నిను, నెట్టి వేడబమొ! రామా! ఆపదుద్ధారకా!

"దనుజుల్ పన్నిన మాయగాక యది సత్యంబంచు డెందంబునం దనుమానింపకు, మార్తరక్షణునకే యాపత్తులౌ? నీదు ర క్షణ సేయన్ నియమించె నన్ను, దొసఁగెంచంబోకు మీ" నాఁగ; ల క్ష్మణు దూఱెన్ దయమాలి భూతనయ; రామా! ఆపదుద్ధారకా!

ధరణీ పుత్రిక యట్లనన్ బెఱ నెలంతల్ లెక్కయే?- యాపదల్ తఱియన్‌బుద్ధినశించుఁ, బూర్వసుకృతుల్ వ్యర్థంబులౌ, సత్కృపా పరతల్ చేడ్పడుఁ, దాఱుమాఱగుచు విశ్వంబెల్లఁ జూపట్టెడున్ మరియాదన్ బరికింపనీదుగద! రామా! ఆపదుద్ధారకా!

మును నీ చండ పరాక్రమమం బెఱుఁగదా? భూపుత్రి, సౌమిత్రి భా
వనిరూఢిన్ గనలేద? యింతయును దైవప్రేరణన్‌గాక, ల
క్ష్మణు నారీతినిఁ దూలనాడి వెడలింపంజేయు తద్వృత్తి క
న్య నిదానంబిఁక నేదియేన్ గలదె? రామా! ఆపదుద్ధారకా!

అనుపేక్ష్యంబగు నీదునానతినిఁ ద్రోయన్‌లేక, నష్టాత్మయై
తను నింద్యోక్తుల నొవ్వఁగాఁబలుకు సీతన్ జూడగాలేక, దై
వ నియోగం బనివార్యమౌట 'తరుణీ స్వాంతంబు సర్వంకషం'
బని, నిర్జేరఁగరాఁడె లక్ష్మణుఁడు? రామా! ఆపదుద్ధారకా!

కనకైణంబది యేమి? యీ మనుజలోకం బేమి? నమ్మంగరా
దనుమానం బిది-దైత్యమాయ యని, సుంతైనన్ విచారింప కీ
వనువర్తించుట, సీత లక్ష్మణుని నీకై యంపుటల్ చూడ, మీ
మనుజత్వంబొ? విధి ప్రతిష్ఠతమొ? రామా! ఆపదుద్ధారకా!

సీతాసాధ్విని లాతినాతియనుచున్ జింతించి కొంపోయె నా
దైతేయేశుఁడు, సర్వ రాక్షసకుల ధ్వంసార్థమై భూమి సం
జాతంబైనది, యాదిశక్తియని యెంచంబోఁడు; దుర్మోహ సం
పాతైశ్వర్యుఁ డెఱుంగునే? విధిని; రామా! ఆపదుద్ధారకా!

ధరణీపుత్రిక రోదనంబు వినుఁడున్ దైత్యాధిపున్‌దాకి, యు
గ్రరణంబున్ బొనరించి, కూలి, తుది, వార్తన్ నీకెఱింగించి నీ
కరుణన్ జూఱఁగొనెన్ జటాయు; వటు లోకాతీతమై పొల్చు స
న్మరణాంత్యక్రియ లేరికేన్‌గలవె? రామా! ఆపదుద్ధారకా!

నన లేకుండిన తీఁగవోలె, శశి హీనంబైన రాత్రింబు న
ట్లనువౌ దీపములేని గీమువలె సీతాఽభావమౌ నాకుటిం
టినిఁజూడన్ మది నెట్లుగుందితివొ? గ్లానిన్ జెంది యేరీతి ల
క్ష్మణుతో నేమని జాలినొందితివొ? రామా! ఆపదుద్ధారకా!

దనుజుల్ పన్నిన, మాయఁ గేరితివొ! కాంతల్ చూపు దుస్సాహసం
బునకున్ రోసితొ? మున్ను నీవిడిన పన్నున్ద్రోయు సౌమిత్రి వ
ర్తనమున్ దూలఁగనాడితో? చెనఁటి కర్మంబాడితో? సీతకై
మనమం దేమనిసంతపించితివొ? రామా! ఆపదుద్ధారకా!

వనిలో వెన్నెలరాత్రులన్ విరహతాపంబొందు నిన్గాంచి ల
క్ష్మణుఁడోదారుప, జానకీ గుణ విశేషంబెల్ల నగ్గించుచున్
దిన మొక్కొఁడుగఁ బుచ్చి, ఘోర విపదబ్ధిన్ దారకంబింక నే
మనుచున్, వేఁదుఋనట్లు క్రుమ్మరవె? రామా! ఆపదుద్ధారకా!

కనులన్ మూసిన సీత, కన్నుఁదెఱవంగా సీత, నల్దిక్కులన్
వెనుకన్ ముందును సీత, వస్తువెదియేన్ వీక్షించినన్ సీత, యే
మననౌ? లేద-తదన్యమౌ ప్రకృతి; సీతాఽద్వైతభావంబు ల
క్ష్య నిరూఢస్థితినొందె నీ హృదిని; రామా! ఆపదుద్ధారకా!

అరవిందాప్త కృపావిశేషమొ? జగత్ప్రాణు ప్రభావంబొ? యీ
శ్వర మాహాత్మ్యమొ? యంజనాగురు తపశ్చర్యాఫలంబో? యహ
స్కరకన్యా సుకృతత్వమో? హనుమ నీ సంసేవనానూన ది
వ్య రసాంభోనిధి నోలలాడెగద; రామా! ఆపదుద్ధారకా!

కప-నాఁ, గంతు వసంతులఁ గెలుచు సింగారంబులుఁ, నీల వ
జ్రివపుచ్ఛాయలు, వల్క లాజిన జటా చాపంబులుఁ, రాజ ది
వ్య విలాసంబులనొప్ప మిమ్ముఁగని, సంభావించి సుగ్రీవ స
ఖ్య విధిఁ గూర్పఁడె? వాయునందనుఁడు: రామా! ఆపదుద్ధారకా!

అనురాగంబున నీకు భాస్కరసుతుండర్పించె వైదేహి వై
చిన భూషల్ గలఁ మూఁట గానుకగ; వీక్షింపంగ నద్దాని నే
మని వాపోయితొ? నీవుచూపు నగలం దందెల్ నిరూపించి ల
క్ష్మణుఁడేడ్చెఁ; దన నీమమెట్టిదియొ? రామా! ఆపదుద్ధారకా!

"వాలిఁ గూల్చి, యధర్మవర్తన కిలన్ బాల్తెతి వీ" వంచు వీ
రాలాపంబులువల్కు మానిసులు నిందారోపణల్ సేసి; రం
తేలా? యాశ్రితపారిజాతమవు, నీ వేదైనఁ గావింపవే
నా లక్ష్యార్థము నీ కదెట్లమరు?- రామా! ఆపదుద్ధారకా!

కపినాథుండు మహీతనూజ నెమకంగా వేనవేల్ కోఁతులన్
విపులా చక్రమునందు నల్దిశలకంపెన్, వారిలోనెల్ల నీ
కృపకున్బాత్రుఁడు వాయునందనుఁ డొకండేకాఁడె? సందేశ వా
క్య పవిత్రాంగుళిముద్ర లీ విడుట. రామా! ఆపదుద్ధారకా!

అమరేడ్యన్ సురసన్ దగన్గెలిచె, ఛాయాగ్రాహినిన్గూల్చెఁ, బ్రే
మమునఁ డాసిన వాయుమిత్రమగు నా మైనాకు శంసించె, భ
ద్రముగా లంకనుజేరె, లంకిణిని విద్రావించె, నీ యంగుళీ
య మహత్త్వంబునఁజేసి మా హనుమ; రామా! ఆపదుద్ధారకా!

పురియందున్గల సౌధముల్ గృహములున్ బూఁదోఁటలున్ దోఁటలున్
సరసుల్, వీధులు, సందుగొందులు, రహస్యస్థానముల్ వేఱ, నే
డ్తెఱ గాలించెను, జూఁచెఁ, గ్రుమ్మరియె, శోధించెన్ బరీక్షించె వే
మఱు; సీతన్ గనఁడయ్యెఁగా హనుమ! రామా! ఆపదుద్ధారకా!

జాలింజెందియు, సీత నానిశినిఁగాంచన్ దుర్లభంబయ్యెనేన్
వాలాయంబుగ సాట్టగోపుర వన ప్రాకార లంకాపురిన్
వాలంబందునఁజుట్టి, యెత్తికొని, నీ పాదస్థలిన్ నిల్పఁగా
నాలోచించె మహోగ్రుఁడై హనుమ; రామా! ఆపదుద్ధారకా!

"పెనులోభంబున లేడిఁ గోరి పతికిన్ వేషైతిఁ, గాంతారమం
దనురక్తిన్ మముఁగొల్చులక్ష్మణుని నిందాలాపముల్ వల్కితిన్,
వనితాగౌరవమెల్లఁ గోల్పడితి, నేఁ బాపాత్మ, నీ శిక్ష నా
కనుభావ్యం" బని, యేడ్చె భూతనయ; రామా! ఆపదుద్ధారకా!

"కరుణంజూపఁడు రాఘవుం, డిటకు మార్గంబేరికిన్ దోఁప, దీ
పురికింజేరఁగలేరె వారలును, రేపోమాపో భక్షింతురు ము
ష్కరు లీ రక్కసు, లింక నీ బ్రతుకు నాసల్ పూనరా" దంచు నీ
స్మరణన్ జేసెను సీత- యార్తమతి; రామా! ఆపదుద్ధారకా!

"అసదీ లంకకుఁజేర రాఘవుల. కే యాధారమున్ లేని స
న్నసుకల్ చంపుటనిక్కువంబ; యింక మత్ప్రాణేశునిన్ గొల్చి యా
యసువుల్ పాసెద"- నంచు నేడ్చుసతి దీనాలాపమాలించి, తా
మసలన్ రాదని వెల్వడెన్ హనుమ; రామా! ఆపద్ధుద్ధారకా!

ప్రాణత్యాగముఁ జేయఁగాఁ గడఁగు నా వైదేహినింగాంచి, భా
షా నైపుణ్యము నర్థశుద్ధియు విమర్శాదృష్టిమైఁ బల్కి, స
న్మానంబుంగని, యుంగరంబిడి, యభిజ్ఞానోక్తులం దెల్పి, య
త్యానందంబును గూర్చెఁడే? హనుమ; రామా! ఆపదుద్ధారకా!

"హనుమా! నాప్రభుమంగరంబొసఁగి యీప్రాణంబులన్నిల్పి తీ
ఋణమెట్లీఁగుదునో? యనేక నతులర్పింతుగా; శిరోరత్నముం
గొని, శ్రీరామునకిచ్చి, నా స్థితిని వాక్రుచ్చవ్వంగదే!" యంచు నొ
య్యన శోకాకులయయ్యె భూతనయ; రామా! ఆపదుద్ధారకా!

"కనులంగ జూచుచున్నవేళ 'కరుణా కాకుత్స్థుఁడే' దవ్వులం
దనురాగంబుఁగనండు; పక్షిపయి బ్రహ్మాస్త్రంబు సంధించె, నీ
దనుజాధీశు నుపేక్షఁజేసె, నిది యే ధర్మంబొ? యూహింపు" మం
చనదే? మారుతిఁగాంచి, భూతనయ; రామా! అపదుద్ధారకా!

ప్రమదారత్నము సీతయిచ్చిన శిరోరత్నంబు సద్భక్తి భ
ద్రముగాదాఁచి. యశోక దివ్యవన విధ్వంసంబుఁ గావించి, యొ
క్క మొగింగ మూఁగిన శత్రుసంతతిని వీఁకంగ జీల్చి చెండాడి, దై
త్య మహీశుంగనఁ జిక్కెఁబో, హనుమ; రామా! ఆపదుద్ధారకా!

"కోఁతీ! యెవ్వఁడవీవు?-నే హనుమ;-నీకున్ రాఁ గతంబేమి?-మా
సీతంగాఁడగ; బంపి రెవ్వరు నిన్నుం?- శ్రీరాముఁడంపెన్; వనం
బాతీరుంగ జెడఁగూల్చితేల?- నిను డాయన్; దేనికో?- బుద్ధి నే
నై తెల్పంగ;"- నటంచనెంగ హనుమ; రామా! ఆపదుద్ధారకా!

"ధరణీ పుత్త్రిక సీత నీదు గళబద్ధంబైన కాలాహి, కం
ధర సంవేష్టిత కాలపాశము, శిరస్థంబైన దంభోళి, ము
ష్కర దైత్యాటవిదావ వహ్ని, సతివేషంబూను పెన్మృత్యు వం
చరయన్ రావణ! మే" లనెన్ హనుమ; రామా! ఆపదుద్ధారకా!

"తనరన్ శిక్షకు శిక్షసేసితివి నీ దక్షత్వ మక్షీణమే?
కని రమ్మన్నను గాల్చివచ్చితివి, యౌఁగా" కంచుఁ గీశాళి వె
న్నొక్కన, నిన్నేరి, 'సజీవఁజూచితి ననుంగుందల్లి' నంచున్ శిరో
మణి నర్పించు హనూమ కేమిడితొ? రామా! ఆపదుద్ధారకా!

ఎంతేఁ గర్వముపూని పొంగెదవ? 'యొక్కింతేని సందీయ, విం
కింతున్గా' కని యాగ్రహుండవయి యాగ్నేయాస్త్రమున్దీయ, నీ
పొంతన్దోఁచి, యుపాయమున్దెలిపి నిన్మ్రొక్కెన్సముద్రుండు; క
ల్పాంతంబేగద! నీ వలుంగునెడ; రామా! ఆపదుద్ధారకా!

"ఏ నీవాఁడ" నటంచు నొక్కపరి నే యేవాఁడునేఁ గోర నా
ప్రాణిఁ బ్రోచెద-నిద్ది నాదగువ్రతంబౌ సుమ్మి, యా రావణుం
డైనఁగాని, విభీషణుం డొకఁడదేలా?" యన్న నీ సూక్తి, యు
త్యానందామృతకంద మౌనుగద! రామా! ఆపదుద్ధారకా!

"గిరు లంభోనిధిఁదేలె, నెల్ల కృతులఁ గీశాళి కావించెడిఁ
నరులే దైత్యులరూపు మాపెదెని, యన్యాయంబుగాకేమి? యు
చ్చెరువుందోఁచె"-నటంచురావణుఁడుఁదాఁ జిత్తంబునందెంచఁడే?
యరయఁ శక్యమె నీ విలాసముల?- రామా! ఆపదుద్ధారకా!

అనుజుం డీవును ఋక్షవానరులు మాయాశీలుఁడౌ నింద్రజిత్
ఘనబాణాహతినొచ్చి మూర్ఛనమునుంగ౯, జాంబవంతుండు దె
ల్పిన సంజీవన శైలము౯బెటికి వేవే తెచ్చి రక్షించు మా
హనుమ౯మించినజోదు నీ కెవఁడు?- రామా! ఆపదుద్ధారకా!

సురలెల్ల౯ నుతియింప మౌని మనుజస్తోమంబు లగ్గింప, వా
నరు లుత్సాహమునొంద, లోకచయ మానందాంబుధి౯దేల, భూ
భరులౌ రావణ కుంభకర్ణులను విధ్వంసంబు గావించు నీ
హరభావంబున కేటికోళ్ళిడుదు; రామా! ఆపదుద్ధారకా!

రణరంగంబున నీకునై పెనఁగుచు౯ బ్రాణంబుల౯ గోలుపో
యిన భల్లూక వనేచరాళికయి యెంతేఁగుంది, యంభోరుహా
సను బ్రార్థించియు వారినెల్ల బ్రతికించంగన్న నీ ప్రేమ, నీ
యనురాగంబు లెవారికే౯గలవె? రామా! ఆపదుద్ధారకా!

నీ సేవ౯గలభాగ్య మెయ్యదియొకానీ, తారు దారాదృతి౯
జేసె౯ గోఁతు లెలుంగులు౯ విహగముల్ చక్రోడముల్ నీదు వి
శ్వాసంబెంతయుఁ గొల్లకొట్టుకొనె, నేచందాన నీవా ఋణం
బాసాంతంబుగ దీర్పఁగల్గితివొ? రామా! ఆపదుద్ధారకా!

అనుమానంబును నీవు గాంచితివ?-లేదా- కాకులౌ లోకులే
మని వాకొందురొ యంచు జంకితివ?-కాదా- యింతిపై నల్గియా?
యనుజుం డిచ్చను మెచ్చనా?- కపుల సఖ్యత్వపరీభావంబ?- యే
మని యగ్నింజొరుమంటి జానకిని?- రామా! ఆపదుద్ధారకా!

చరితార్థత్వముఁ గాంచరే జనములుఁ నంతర్పణల్ సేసి; నీ
పరివారంబును నిన్ను నాదృతి భరద్వాజుండు సంతృప్తులఁ
బఱుపఁ గూర్చిన విందు లెందుఁగలవే? మౌనీంద్రు సన్మానముల్
మఱవఁ వచ్చునె యెన్నఁడేనియును? రామా! ఆపదుద్ధారకా!

"పదునాల్గేఁడులు నేటితోసరి, యిఁకఁ బ్రాయోపవేశంబుఁ జే
సెద" నంచుఁ భరతుండు సిద్ధమగుడుఁ సీతాదులఁగూడి పెం
పుఁదలిర్పఁ దఱిఁజేరు నిన్గనుచు సమ్మోదించు నా నాఁటి సం
పద వర్ణింపఁ బదంబులున్గలవె? రామా! ఆపదుద్ధారకా!

తురగంబుల్ భరతుండొగిన్నడుప, శత్రుఘ్నుండు ఛత్రంబుఁ, జా
మరముల్ లక్ష్మణుఁడున్ విభీషణుఁడు ప్రేమన్వాల్ప, వైదేహితో
నరదంబెక్కి, కపుల్ జయధ్వనులు సేయన్ బౌరవర్గంబు సం
బరమొందన్ బురిఁజేరు నిన్ దలఁతు; రామా! ఆపదుద్ధారకా!

పలు సామంతులు మంత్రులున్ బ్రజలుఁగొల్వన్ బుణ్యతీర్థోదకం
బుల, ఋత్విక్కులతో వసిష్ఠుఁడు శ్రుతిప్రోక్తంబుఁగా దివ్య మం
గల సాకేత సుభద్రపీఠి నభిషేకశ్రీలఁ గైసేయ భ
వ్య లసత్కీర్తినిఁ గన్న నిఁగొలుతు; రామా! ఆపదుద్ధారకా!

శ్రితులఁ బ్రేమ బహూకరించియు ధరిత్రీపుత్రికై హార మి
చ్చితి, దానిఁగొని సీత యెల్లరను వీక్షింపఁగ, 'నీ మెచ్చు స
త్కృతి కీవియు' మనంగ, మారుతికి నర్పించెఁ; దదీయాప్తిచే
నతి పూజ్యుండయి పొల్చె మా హనుమ; రామా! ఆపదుద్ధారకా!

త్రేతన్ రాజనువాఁ డెవండనిన మా 'శ్రీరాముఁడే' యండ్రు; నీ
దూతన్ బేర్కొన 'రామదూత హనుమంతుం' డొక్కఁడేయండ్రు; సా
కేతంబున్ మఱిపించె నేదియనఁ 'గిష్కింధాపురం' బండ్రు; వి
ఖ్యాతంబందురు 'రామనామము' ను; రామా! ఆపదుద్ధారకా!

ధరణీపాలన నీ వొనర్పఁగ, ప్రజోత్సాహంబు పెంపొందె, నె
వ్వరు నే కష్టమెఱుంగకే బహువిధైశ్వర్యంబులన్ గాంచి రె
ల్లరు 'రామా!రఘురామ!' యంచు ధరయెల్లన్ రామభూతంబునై
మఱపించెన్ సకల క్షితీశ్వరుల; రామా! ఆపదుద్ధారకా!

కనియెన్ మారుతి నీదుతత్త్వమును; సఖ్యత్వంబు సుగ్రీవుఁడున్
గనియెన్; సత్యగతిన్ విభీషణుఁ డెఱుంగన్ నేర్చె; నీ చాప వి
ద్యను గాంచెన్ దశకంధరుండు; పురుషార్థ శ్రీదమౌ నీదు నా
మ సిధిన్ గన్గొనఁజాలె శంకరుఁడు; రామా! ఆపదుద్ధారకా!

సరసన్ జానకి లక్ష్మణుల్, భరతుఁడున్ శత్రుఘ్నుఁడా వెన్క, భా
స్కర పుత్రాంగద జాంబవంతులును లంకాధీశుఁడున్ మూలలన్
వరలన్, మారుతిమ్రోలనిల్చి వినుతింపన్, స్వర్ణపీఠిన్ మనో
హర రూపంబునఁ బొల్చు నిన్ గొలుతు, రామా! ఆపదుద్ధారకా!

## స్వవిషయము.

గురుఁడున్ నాల్గవయింట నీచఁబడె నాకున్ దాన శుక్రాంతరం
బరయన్ జిక్కులుఁ గష్టముల్ పొసఁగె; షష్ఠాష్టస్థితిన్‌జేసి యు
ద్వర వైరంబులు నన్గలంచె, నిఁకఁ బ్రాపున్ నీవుఁగా నమ్మి నీ
మఱుఁగున్ జేరితిఁ; బ్రోవఁగాఁగదవె! రామా! ఆపదుద్ధారకా!

హితమేదో యెఱుఁగంగలేక మది నెంతేఁ దారుమారైన స
న్నుతికూర్మిన్ దఱిఁజేర్చి, భాగవత వంశాంభోధి చంద్రుండు, మా
రుతి పూజానిరతుండు సాధు బుధవర్యుం డన్నపూర్ణుండు స
మ్మతి నన్నీకృతిఁ బల్కఁగాఁ బనిచె; రామా! ఆపదుద్ధారకా!

'తులసీరామ చరిత్రమానసము' సంతుష్టాంతరంగుండనై
తెలుఁగుంజేయఁగఁబూని, తత్కృతిని బ్రాఁతిన్గొంతవ్రాకుచ్చి, యా
వల సర్వంబును గట్టిపెట్టితిని; దుర్వ్యాపార పారీణతన్
మలినంబొందెను జిత్తమెంతయును; రామా! ఆపదుద్ధారకా!

కలమున్ బట్టియు నాలుగేఁడులకుఁ బైఁగానయ్యె; సత్సంగ మా
వలకున్ వ్రొగ్గె, నినున్భజించుటలు దవ్వైపోయె; వ్యాపారముల్
కలహప్రాప్తినిఁ గూర్చె; నింతనయినన్ గారుణ్యమేపార ని
ర్మలచిత్తంబు నొసంగఁగాఁగదవె! రామా! ఆపదుద్ధారకా!

సతమున్ సీతను నిన్ స్మరింతు వివిధైశ్వర్య ప్రదానాఢ్యులన్,
శ్రిత సంరక్షణదక్షుఁడౌ హనుమకున్ జేజేల నర్పింతు, స
త్కృతి పూర్ణుండగు నన్నపూర్ణునకు నర్పింతున్ నమోవాకముల్,
మతి సేవింతును భక్తులెల్లరను, రామా! ఆపదుద్ధారకా!

కృ తి స మ ర్ప ణ

ఘన బాపట్ల శుభాన్వయాంబునిధి రాకాసోముఁడౌ వీరయా
ర్యునకున్ సాధ్వికి చిన్నపున్నమకుఁ బుత్రుండౌ హనుమాఖ్యుఁ డిం
పొనరన్ దాఁబు చైత్ర కృష్ణ దశమిన్ బూరించి యర్పించెఁ బ్రే
మను శ్రీవారికి నీదు సత్కృతిని రామా! ఆపదుద్ధారకా!

శ్రీరామచంద్రార్పణమస్తు!

శ్రీరామచంద్రాయ నమః

# సప్తర్షి రామాయణము.

౧. బాలకాండము

కశ్యపుఁడు.

జాతః శ్రీరఘునాయకో దశరథాన్మన్యాశ్రియాత్ తాటకాం
హత్వా రక్షిత కౌశిక క్రతువరః కృత్వాఽప్యహల్యాం శుభాన్
భంక్త్వా రుద్ర శరాసనం జనకజాం పాణౌ గృహీత్వా తతో
జిత్వార్ధాధ్వని భార్గవం పునరగా త్సీతాసమేతః పురీమ్.

శ్రీరాముఁడన శ్రీహరిసుతుఁడై కౌసల్యా
దశరథులకు నయోధ్యను జనించి,
గురు వసిష్ఠుని భక్తిఁగొల్చి విద్యల నేర్చి,
కౌశికాజ్ఞను తాటకను వధించి,
దనుజులఁ బరిమార్చి, తపసి జన్నముఁ గాచి,
గౌతము సతినిఁ బవిత్రఁ జేసి.
శంభు చాపముఁ ద్రుంచి జానకిఁ జేపట్టి,
మిథిలను మోదాంబునిధినిఁ దేల్చి,

భార్గవుని గర్వమడగించి మార్గమందు,
నవ వధూయుత భ్రాతృలు వివిధ బంధు
జనులుఁ బరిజనములు సంతసమునఁ గొలువ
సీతతోఁ బ్రవేశించె సాకేతపురము.

దాస్యా మంథరయా దయా రహితయా దుర్భేదితా కైకయీ
శ్రీరామ ప్రథమాభిషేక సమయే మాతాఽప్యయాచత్ వరౌ.
భర్తారం; "భరతః ప్రశాస్తు ధరణీం"-"రామో వనం గచ్ఛతా"
దిత్యాకర్ణ్య స చోత్తరం నహి దదౌ దుఃఖేన మూర్ఛాంగతః.

దాసియు మిగుల నిర్దయయును గుటిల సం
చారయౌ మంథరా ప్రేరణమున
ననుఁగుఁదల్లియు దయాఖనియైన కైకేయి
మతిచెడి స్వార్థయై మంకుఁబూని,
శ్రీరామ పట్టాభిషేక కాలంబునఁ
బతి మున్నిడిన వరద్వయముఁ దెలిపి,
"భరతున కీ రాజ్య పట్టంబు గట్టుము
రాము నీ రేడు వర్షముల దనుక

నడవులందుండ నియమింపు"-మనుచుఁ గోరఁ
బ్రాణముల కెక్కుడౌ రాముఁ బాయలేక,
బొంకలేక, దుర్విధిఁ ద్రోసిపుచ్చలేక
మూర్ఛనొందెను దశరథ భూవిభుండు.

3. అరణ్యకాండము　　　　　　　　భరద్వాజుఁడు.

శ్రీరామః పితృశాసనా ద్వనమగా త్సౌమిత్రి సీతాన్వితః
గంగాంప్రాప్య జటాం నిబధ్య స గుహః స చ్చిత్రకూటే వసన్
కృత్వా తత్ర పితృక్రియా స్స భరతో దత్వాఽభయం దండకే
ప్రాప్యాగస్త్య మునీశ్వరం త దుదితం ధృత్వా ధనుశ్చాక్షయమ్.

తండ్రియానతిఁ దలఁదాల్చి శ్రీరాముండు
　జానకీ సౌమిత్రిసహితుఁ డగుచు
సాకేతపురి వీడి జాహ్నవీనది డాసి
　జటిలయ్యె, కడచి, గుహ సహితుఁడగుచు
చిత్రకూటమున వసించి, భరతుఁదేర్చి
　పితృ కర్మముల యథావిధి నొనర్చి,
పాదుక లొసఁగి యా భరతు కోరికఁదీర్చి
　దండక నభయప్రదాన మొసఁగి,

తాపసులఁగొల్చి సదయ సల్లాప ఫణితిఁ,
చని, యగస్త్యుని మ్రొక్కి, యక్షయ్యశర శ
రాసనంబులు బహువిధా శాసనములు
వడసి, దక్షిణాటవులను వెడలె నంత.

౪. కిష్కింధాకాండము　　　　　　　　　　విశ్వామిత్రుఁడు

గత్వా పంచవటీ మగస్త్య వచనా ద్దత్వాఽభయం మౌనినాం
ఛిత్వా శూర్పణఖాస్య కర్ణయుగళం త్రాతుం సమస్తాన్మునీ-
హత్వాతంచ ఖరం సువర్ణహరిణం, భిత్వా తథా వాలినం
తారారత్నమ వైరిరాజ్యమకరో త్సర్వంచ సుగ్రీవసాత్.

ముని యగస్త్యుని పనుపున దాశరథి పంచ
వటియందు నొక పర్ణకుటి వసించి,
పరిసరాశ్రమముల చరిసించి మౌనుల
కభయప్రదానంబు లందఁజేసి,
పాపి శూర్పణఖఁ గురూపను జేయించి
ఖరదూషణాది రాక్షసులఁ దునిమి,
మాయా కురంగమౌ మారీచుఁ బరిమార్చి,
యపహృత సీతకై యడవులరసి,

తెగిపడిన జటాయువునకు సుగతిఁగూర్చి,
హనుమ కతన సుగ్రీవు సఖ్యంబు వడసి,
వాలిఁగూల్చి, కిష్కింధా సుభద్రపీఠిఁ
గీశ లోకేశుఁగాఁగ సుగ్రీవునిలిపె.

27

౫. సుందరకాండము  గౌతముఁడు.

దూతో దాశరథే స్సలీలముదధిం తీర్త్వా హనూమాన్ మహాన్
దృష్ట్వాఽశోకవనేస్థితాం జనకజాం దత్వాంగుళే య్మద్రికామ్
అక్షాదీ నసురాన్నిహత్య మహతీం లంకాంచ దగ్ధ్వాపునః
శ్రీరామంచ సమేత్య "దేవ! జననీ దృష్ట్వామయే" త్యబ్రవీత్.

శ్రీరామ దూత సుధీరుఁడు మారుతి
కెరలి వారాశి లంఘించు తఱిని
మైనాకు శంసించి, మ్రందించి సింహికన్
సురసన్ సమాధానపఱచి, కడచి,
లంకాపురిన్ జొచ్చి లంకిణిన్ మర్దించి
శోధించి నగరి నశోకవనినిఁ
జేరి, రామార్పిత చిత్తయౌ భూ సుతన్
గని మ్రొక్కి, వినతి నుంగరమొసంగి,

వనముఁ బెకలించి, అక్షాది దనుజులను వ
ధించి, లంకన్ దహించి, యబ్ధినిఁ దరించి
జానకీ శిరోమణిని దాశరథి కొసఁగి
"స్వామి! ప్రాణసహితఁ గంటి జనని" ననియె.

ఫలశ్రుతి.

శ్రీరామస్య కథా సుధాతి మధురాన్ శ్లోకానిమా నుత్తమాన్
యే శృణ్వంతి పఠంతి చ ప్రతిదినం తేఽఘౌఘ విధ్వంసినః
శ్రీమంతో బహు పుత్ర పౌత్ర సహితాః భుంక్త్వేహ భోగాంశ్చిరం
భోగాంతేతు సదార్చితం సురగణై ర్విష్ణో ర్లభంతే పదమ్.

సప్తర్షి కృతము సంక్షిప్తము హనుమ దాం
ధ్రీకృత శ్రీరామ దివ్యచరితఁ
బ్రతిదినంబుఁ బఠించు వారలు వినువారు
సకల పాపంబులు సమసిపోవ
ఆయు రారోగ్యభాగ్య సుపుత్ర పౌత్ర సం
కలితులై వివిధ భోగములఁ బడసి,
రామచంద్ర ప్రవర్తన నిజాదర్శంబుఁ
గాఁ గొని జీవితగతినిఁ బఱపి,

జీవితాంతంబునన్ సుర సేవితంబు
న నితర సు దుర్లభంబు నవ్యయము నైన
శ్రీమహావిష్ణు ధామంబుఁ జేరుచుంద్రు
జానకీ రామ సాయీప్రసాద గరిమ.

శ్రీరామచంద్రార్పణ మస్తు!
లోకాస్సమస్తా స్సుఖినో భవన్తు!
ఓమ్ తత్, సత్.

## ఈ రచయితచే రచియింపబడి ముద్రితములైన గ్రంథములు.

1 శ్రీమద్భగవద్గీతామృతము (భగవద్గీత శ్లోకములు – తెనుగుపద్యములు)

2 ప్రబోధసుధాకరము (శ్రీ శంకరభగవత్పాదరచిత ప్రకరణ గ్రంథము- శ్లోకములు- తెనుగుపద్యములు)

3 ఆశ్చర్యచూడామణి (శ్రీరామచరిత్రము - శక్తిభద్రకృత సంస్కృత— నాటకమున కాంధ్రానువాదము)

## శ్రీ సాయిలీలా ప్రచురణములు

1 శ్రీ సాయీబాబా పూజా స్తవములు (2 వ కూర్పు) 1-00

2 శ్రీకృష్ణకర్ణామృతము. 1.00
(భక్తలీలాశుక సంస్కృతకృతికి తెనుగు గీతములు)

3 శ్రీ సాయీ మననము (3 సర్గములు) 1.00

4 శ్రీ ఆపదుద్ధారక శతకము (2 వ కూర్పు) 0 50
(శ్రీరామ కథాత్మకము) సప్తర్షి రామాయణ సహితము.

5 శ్రీ సాయీశరణ 4 భాగములు 2.00

6 శ్రీ వేంకటేశ్వర సుప్రభాతగీతములు (2 వ కూర్పు) 0–25

7 శ్రీ సాయీబాబాకూడ దేవుఁడేనా? ఉన్న దేవుళ్ళుచాలకనా? 1.00
(సందేహనివృత్తి)

## ముద్రణము కావలసినవి:-

8 శ్రీ సాయీ కబీరుసూక్తులు (సాఖీలు- ద్విపదలు)

9 శ్రీ సాయీ విజయము (జంగమకథ)

10 ప్రేమామృతము (నారద భక్తిసూత్రములు టీక- తెనుగుపద్యములు - వివరణ గీతమాలిక).

11 ఏమీ, నిన్నుపేక్షింతునా? (శ్రీ సాయీబాబాచరిత్ర, భక్తుల అనుభవములు, తెనుగువచనము)

12 శ్రీ సాయీ అనుసరణ.